# శ్రీ అద్వైత శాంకరి






తిరుమల తిరుపతి దేవస్థానమువారి ద్రవ్యసహాయముతో

ముద్రితము.



—: రచయిత :—

వంగర కాశీవిశ్వేశ్వర వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రథమ ప్రచురణ

దుందుభినామ సంవత్సర వైశాఖ పౌర్ణమి శుక్రవారం

7–5–1982



*

ప్రతులు : 1000

*



మూల్యము : **4-00**

*

ప్రతులకు :

వంగర కాశీవిశ్వేశ్వర వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

ఐ. టి. సి. లిమిటెడ్ — ఐ. యల్. టి. డి. డివిజన్

517,

పి.బి. నెంబరు - ~~20, రాజమండ్రి - 533 101~~.

గుంటూరు - 522 004

# జగద్గురు శ్రీ ఆది శంకరాచార్య



శ్లో॥ "శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయమ్
నమామి భగవత్పాదం శఙ్కరం లోకశఙ్కరమ్".

❦ ❦ ❦

భగవత్పాద వరాఖ్య శంకర లసద్వాగ్వైఖరీ రూపమై
నిగమార్థ ప్రతిబోధ తత్త్వయుత నిర్ణీతార్థ సిద్ధాంతమై
తగుకీతిన్ మదినాత్మ భావమనుసంధానంబు గావించుచే
తగు నాకున్ భవదీయ దివ్యపద చింతాసక్తియే శాంకరీ.

# శ్రీశ్రీశ్రీ జగద్గురువుల చరణారవిందములకు
# సాష్టాంగ ప్రణామములు

"సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమాం
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరాం."

శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య సుప్రతిష్ఠిత దక్షిణామ్నాయ శ్రీ శృంగేరీ శారదా పీఠాధిపతులు మరియు శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులును సాదరముతో నా శతకమును పరిశీలించి తమ ఆశీర్వచనములతో గూడిన శ్రీముఖములను ప్రసాదములను ప్రసాదించినారు.

శ్రీ చరణుల ఆశీర్వాద ప్రసాద బలములతో నా శతకము బహుళ వ్యాప్తి నొందుననుట వాస్తవము.

నా యావజ్జీవిత కృతజ్ఞతను తెల్పుకొనుచు శ్రీ చరణుల చరణ కమలములకు సాష్టాంగ ప్రణామము లర్పించు కొనుచున్నాడను.

ఇట్లు,
శిష్యపరమాణువు
వంగర కాశీవిశ్వేశ్వర
వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

శ్రీశ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థానము

Camp : కల్లిడై కురుచ్చి. శారదాపీఠము, శృంగేరి,ది. 26-11-81

శ్రీయుతులు వంగర కాశీవిశ్వేశ్వర వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి నమస్కారములు. తమరు పంపిన "అద్వైత శాంకరీ" అను పొత్తము అందినది. శ్రీ జగద్గురు చరణులవలోకించినారు.

వేదాంతమునందు తమకుగల యభిరుచికి శ్రీ చరణులు మిక్కిలి సంతోషించినారు. కవిత ప్రసన్నముగ నున్నదనియు చదువరుల మనస్సులకు ఆహ్లాదమును కలిగించునట్లు కలదనియు తెలవిచ్చినారు. తమరు ఇదే విధముగ ఉత్తమ కృతులను రచించి కీర్తిని గడింతురుగాకయని యాశీర్వదించినారు.

Personal Assistant to His Holiness
SRI JAGADGURU SHANKARACHARYA
Dakshinamnaya Sri Sharada Peetham,
Sringeri – 577 139.



Sri Sankara Bhagavadpadacharya Paramparagatha
His Holiness

Sri Kanchi Kamakoti Peetadhipathi

JAGADGURU SRI SANKARACHARYA SWAMIGAL

SRIMATAM SAMASTHANAM

KANCHEEPURAM–631 502.

Camp : Guruvayur Date : 25—10—81

Sri V. K. V. Subramania Sasrty your letter (Telugu Matter 10 pages) has been received and placed before His Holiness.

Prasadams blessed by His Holiness is Sent herewith

Manager.

# కృతజ్ఞతలు

నేను ప్రార్థించినంతనే నా శతకము నవలోకించి తమ యమూల్యాభిప్రాయములను దయతోఁ బంపిన మహాకవులు, నుద్దండపండితులునగు.

(1) బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్యశాస్త్రిగారికి (విజయవాడ)
(2) ,, మల్లావజ్ఝల వెంకటసుబ్బరామశాస్త్రిగారికి (ఓరుగల్లు)
(3) ,, ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారికి (గుంటూరు)
(4) ,, జమ్ములమడక మాధవరామశర్మగారికి (గుంటూరు)
(5) ,, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికి (రాజమహేంద్రవరము)
(6) ,, వారణాశి గంగాధరశాస్త్రిగారికి (కొవ్వూరు)
(7) ,, వేదాంతకవిగారికి (కొవ్వూరు)

నా భక్తిపూర్వక నమస్కారములు.

నా శతకమును నామూలాగ్రముగా పరిశీలించి నా యీ ప్రయత్నమునకు దోహదమునిచ్చిన

(1) సర్వవేదాంత తత్త్వ మీమాంసాపారంగతులు వేదాంతోపన్యాసకులు బ్రహ్మశ్రీ మున్నంగి పున్నయ్య పంతులుగారికి (గుంటూరు.)
(2) బ్రహ్మశ్రీ "కవిశేఖర" బూరుగల గోపాలకృష్ణమూర్తిగారికి (తెనాలి)
(3) బ్రహ్మశ్రీ "అష్టావధాని" చిలుకూరి రామభద్రశాస్త్రిగారికి (రాజమహేంద్రవరము)

నా హృదయపూర్వక నమోవాకములు.

రచయిత.

# పండితాభిప్రాయములు



శ్రీ శివాయ గురవేనమః

బ్రహ్మశ్రీ వంగర కాశీవిశ్వేశ్వర వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తాము రచించిన "శ్రీఅద్వైత శాంకరీ" అను ఆంధ్ర పద్యములతో వ్రాసిన గ్రంథము సావధానముగా గుణదోష పరిశీలనదృష్టితో ఆమూలాగ్రముగా దాదాపు గ్రంథమంతయూ చూచితిని. ఈ గ్రంథమును చూడకముందు తెలుఁగు పద్యములతో వ్రాసిన ఈ గ్రంథమును ఏమి చూచుటయా ? యనితలఁచికూడ "వంగల వేంకట రామశాస్త్రి" గారితో నాకుఁ గొంత పరిచయముండి వారికద్వైత శాస్త్రమందుఁగొంత పరిశ్రమకలదని గ్రహించి వారి గ్రామవాసులు (తాడికొండ, గుంటూరు తాలూకా) బంధువులైన వీరు రచించిన ఈ "అద్వైత శాంకరీ" అను గ్రంథమందుగూడ కొంత సంప్రదాయ సిద్ధ అద్వైత శ్రీ విద్యా ప్రతిపాద్య విషయములుండవచ్చునని విశేష శ్రద్ధతోఁజూచితిని (చూడఁగా) కొన్ని పద్యములనుఁ జదువగా నాకు పరమానందము కలిగి ఆనందబాష్పములతో కొన్ని పద్యములను రెండు మూడు పర్యాయములుకూడా చదివితిని. దానినిఁబట్టి ఈ గ్రంథ రచయితలగు శ్రీ కాశీవిశ్వేశ్వర వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి శ్రవణ ద్వారాగానీ పఠనద్వారాగానీ అద్వైత వేదాంతశాస్త్రమందు ప్రామాణిక ప్రవేశము కలదనీ శ్రీవిద్యా సంప్రదాయమందు కూడ విశేషాభినివేశము కలదనీ మొదట పరదేవి వర్ణనముఁబట్టి సంస్కృతాంధ్ర సాహిత్యముల యందు సమరసభావయుతమగు వ్యుత్పత్తి కలదని గ్రహించితిని. కాని ఒకచోటవారు జగద్విషయములో పరిణామమని వ్రాసిరిగాని బహుశః మాయాపేక్షయా ప్రపంచము పరిణామమని బ్రహ్మాపేక్షయా ప్రపంచము వివర్తమనియే వారి యభిప్రాయమై యుండునని సమన్వయించుకొంటిని. శ్రీ శంకర భగవత్పాదులవారు వ్రాసిన "నానాచ్ఛిద్రఘటోదరస్థిత"

యను శ్లోక తాత్పర్యమునూ ఛాందోగ్యోపనిషత్తులో మృదాది దృష్టాంతము లతోఁజెప్పిన అద్వైత తత్త్వమునూ మాండూక్యోపనిషత్తులోఁ జెప్పిన అకార ఉకారమకార రూపమగు ఓంకారావయములతో బ్రహ్మతత్త్వ ప్రతి పత్త్యుపాయమునూ "సౌందర్యలహరి" మొదలగు గ్రంథములయందుఁజెప్పిన మూలాధార స్వాధిష్ఠానాది షట్చక్రముల ద్వారా సహస్రారమందలి పరదేవీ ఉపాసనాపద్ధతిని సులలితమగు భాషతో ఈ పద్యములయందు వీటిని మరి కొన్ని విషయములనుగూడ సుబోధముగా ప్రబోధించినందులకు చాలా సంతోషించితిని. పరాశక్తిని శ్రీచక్రమందు ఉపాస్యదేవతనుగా వర్ణించి పరమార్థరూపము నిర్గుణతత్త్వమే పరదేవీ నిజస్వరూపమని పర్యవసానం చేసిన ఈ గ్రంథము స్తోత్రరూపముగాను ఉపాసనా క్రమముగను జ్ఞాన క్రమముగను గ్రహింపవచ్చునని సర్వాస్తికులును ఈ గ్రంథమును చదివి తీరవలయునని నా సంపూర్ణాభిప్రాయము.

ఇట్లు,

ది 23-11-81

మద్దులపల్లి మాణిక్యశాస్త్రి
విజయవాడ.



చిరంజీవి సుబ్రహ్మణ్యశాస్త్రి సునామధేయా!

విద్వజ్జన విధేయా! విజయ విశేషాలు
నీకు అశేషములై విరాజిల్లుదువుగాత.

కొవ్వూరు,
27-9-81

"ఆంధ్ర బెర్నార్డ్‌షా"
వేదాంతకవి.

అద్వైత "వేదాంత శిరోమణి" - "మీమాంస విశారద"

మల్లావఝ్ఝల వెంకట సుబ్బరామశాస్త్రి

దయానందకాలని, వరంగల్, ది. 5–11–1981

శ్రీయుత, "వంగర సుబ్రహ్మణ్యశాస్త్రి" యను వారు రచించిన "అద్వైత శాంకరీ" యను శతకమును, నేను అక్కడక్కడ ప్రధాన ఘట్టములందు జదివితిని. మృదుమధురమయిన వారి సహజ కవితాధార, రస, భావగర్భితముగ నున్నదనుటలో నతిశయోక్తి లేదు.

మరియు జన్మాంతరార్జిత సుకృతవిశేషమున లభించిన అద్వైత భావమును, ఔపనిషద సిద్ధాంతమునకు, తు, చ, తప్పకుండ అచ్చటచ్చట పద్యములందు ప్రకటించుట, వారి కవితకు అత్యంత శోభాదాయకము, చదువరులకు ముదావహమునై యున్నది. ఈ శతకమును పాఠకులు చదువుట, కేవలము లౌకికానందముకొరకు మాత్రమేకాక, ఆముష్మికముగ, తరించుటకుగూడ నుపయోగపడుననుటలో సందియములేదు.

ఇట్లు,

మల్లావఝ్ఝల వెంకట సుబ్బరామశాస్త్రి

❀ ❀ ❀

ఓరుగంటి నీలకంఠశాస్త్రి

కౌండిన్యాశ్రమము,

కృష్ణనగరము, గుంటూరు.

తెలుగు వాఙ్మయమున శతకములు విశిష్ట స్థానమును పొందినవి. ఇవి నీతులను, జనుల చిత్తవృత్తులను, దూషణమును, శృంగారమును,

బాధను, భక్తిని, ఇట్లే అనేక విషయములను బోధించుచు జనుల హృదయములను బ్రత్యేక స్థానములనుగా చేసికొనినవి. విద్యాగంధము గల వారిలో ఏవోకొన్ని శతకపద్యములు రానివారు తెలుగునాట అరుదు.

శతకవాఙ్మయము సంస్కృత భాషలోనే ఆరంభమైనను సంఖ్య చాలతక్కువ. అందు శతకములకు ఏకమకుటత్వము గానరాదు. తెలుగున యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకమే చాల ప్రాచీన శతకముగా దోచును.

శతకములు సామాన్యముగా జనసామాన్యమునకు వ్రాయబడుచుండు టచే అందలి విషయము జనులకు అందుబాటులో నుండును.తన దీనావస్థను చెలుపుకొని యభ్యుదయమును గోరుకొనుట, భగవత్కార్యములను స్తుతిం చుకొనుటయు భక్తి శతకములలోని విషయము, తఱచుగా నగపడుచుండును. అంతకంటె విషయ గాంభీర్యమున్నచో అది చదువువారల తలకు ఎక్కదు. ఏదేని శతకములో తత్త్వ ప్రతిపాదమున్నచో అది ఒకటిరెండు పద్యముల లోనే అగపడును.

ప్రకృతశతకము "శాంకరీ" శతకము. గ్రంథకర్త శతకనామము నకు "అద్వైత" విశేషణమునుగూడ కూర్చినారు. శంకరునికిని శాంకరికిని అభేదమగు తలంపుతో ఆ విశేషణముంచి యుందురు. లేదా శతకము "భగవత్పాద శంకర వాగ్వైఖరీ రూపమున నిగమార్థ ప్రతిబోధ"ముతో వెలియుటచేత "అద్వైత" విశేషణమును గావించియుందురు. దీని ప్రయో జనము "ఆత్మభావమనుసంధానము గావించుట "మాత్రమే యని కవి చెప్పుకొనెను. ఇది చాల యుత్తమమగు నభిప్రాయము. "ఋగ్వేదం భగవో అధ్యేమి సామవేదం___" అని తన సర్వశాస్త్రవేత్తృత్వమును సనత్కుమారునితో దెల్పుకొనిన నారదుడు తుదకు "శాస్త్రవిదేవాస్మి, నాత్మవిత్" అని తన అనాత్మవేత్తృత్వమునకు వాపోయినాడు. కావున గ్రంథకర్త ప్రయత్నము చాల ప్రశంసింపదగినది.

ఆత్మవిద్యా విషయమున గురుపాత్రము ఎంత ఆవశ్యకమో అంత అల్పము. గురూపదేశమును, సాధకుడు బహువిధములగు మనననిదిధ్యాసములతో సతతమును పరిశీలించుచుండవలయును. శాస్త్రమును సాధనముగా జేసికొని తన సత్తర్కమును దానికి జోడించి విచారింపవలయును. అట్టివానికి విశ్వమంతయు విమర్శ విషయమగుచుండును. సమయము "ఆసుప్తేః, ఆమృతేః కాలః" అని పెద్దలు చెప్పిరి. అట్లుచేయగా "బహూనాంజన్మ నామన్తే జ్ఞానవాన్ మాంప్రపద్యతే".

తమ యభీష్టసిద్ధికై శ్రీ వం. కా. వి. వేం. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు విశేషశ్రమను గావించినట్లు శతక స్వరూపమునుబట్టి తెల్లమగుచున్నది. ఇది కేవల శాస్త్రతత్త్వ ప్రకాశమగు శతకమగుటచే ఇది సర్వశతక విలక్షణము - విశిష్టము అని చెప్పవలయును. ప్రతి పద్యము తత్త్వ ప్రతిపాదకమే గాన సామాన్యమగునది గానము.

ఇందు అటనట సౌందర్యలహరీ భావములను నిరూపించిరి. అద్వైత తత్త్వ ప్రబోధకమగు లలితారహస్యనామమును ఉత్తమోపాసనమును వివరించు పద్యములు ఎన్నో నిబంధింపబడినవి. సర్వవేదాన్తసారమును ప్రతిపాదించుకొన్ని దక్షిణామూర్తి స్తోత్ర శ్లోకములుగూడ శ్రీ శాస్త్రిగారిచే పద్యరూపమున ప్రకటింపబడినవి. తుదకు జన సామాన్యమునకు గూడ సుబోధములగు భజగోవింద శ్లోకభావములు అచ్చటచ్చట ముచ్చటింపబడినవి. వేదాన్తతత్త్వ ప్రతిపాదనమునకు బహువిధములగు ప్రయత్నములను శ్రీ శాస్త్రిగారు గావించిరి. ఇంత మాత్రమే గాక శబ్దతత్త్వము (28) 'అహం' వ్యవహార రహస్యము, (60) హంసగాయత్రి (86) 'తత్త్వమసి' మహావాక్యార్థము (74) "ఆత్మ నైవజ్యోతిషాఽఽస్తే" అనెడి యాజ్ఞవల్క్యోపదేశము (85) ఇట్లు బహువిధములగు ఆత్మజ్ఞాన మననోపకారక విషయములను ఇందు ప్రతిపాదించి తమ ప్రతిజ్ఞను సార్థకము గావించుకొనిన శ్రీ వం.కా.వి.వేం. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ధన్యులు.

ఓరుగంటి నీలకంఠశాస్త్రి.

25–11–1981.

మహోపాధ్యాయ, దర్శనాచార్య, లాక్షణిక శిరోమణి, శాస్త్రవిశారద, నవవిద్యానాథ, సాహిత్యాచార్య సాహిత్య సమ్రాట్, సాహిత్య రత్నాకర, అభినవానంద.

అభినవభారతి,
బ్రాడీపేట
గుంటూరు–2.
14–11–81.

## జమ్ములమడక మాధవరామశర్మ

అసంహతము, అప్రతీకము అయిన అద్వైత శాంకరి మాయా ద్వైతము నిరూపించునా ! వివర్తము సంగతము చేసికొనునా ! శాక్త శైవాతీతమైన శాంభవమునే యిది నిరూపించునా ! ఇది యుగనద్ధోపాసనమువలె కన్పించునుగదా ! శివశక్తి సమరసయుగళాద్వైతము దీనిలో నున్నదా ! ఉపనిషదద్వైతమని అనగల్గుదుమా ! శాంకరీ పదములో ఆ శంకరుడు, భగవత్పాద శంకరుడు గోచరించుటచేనిది శాంకరాద్వైతము కాదగునా ! ఇంత ఏల ? బ్రహ్మాద్వైతము దీనిలో నున్నదని నిశ్చయింపవచ్చును. సౌందర్యలహరీభావములు అటనటకన్పడును. లలితా సహస్రభావనము రచయితకు కొంతయున్నది. మాయావాదులకు శాక్తము సంగతమగుటను, రచయిత నిభాలనముచేసికొని నిరూపించగలడు.

తన పద్యము కావ్యమని పద్యరచయిత భావించును. ఈ భావనమునకు ఎవరునూ తెరవేయరు. శ్రీమాన్ విశ్వేశ్వరసుబ్రహ్మణ్య రచయిత రచయితకాగలడు. ఇప్పటికే కొంత అయినాడు. అస్తు.

—జమ్ములమడక మాధవరామశర్మ.



## మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

రాజమహేంద్రవరము,
దుర్మతి సం॥ మార్గశిర కృష్ణసప్తమి
గురువారం, 17–12–'81.

శ్రీఅద్వైత శాంకరి అన్వర్థమైన శతకము. శతకకర్త శ్రీ వంగర కాశీవిశ్వేశ్వర వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

కవిముఖతః వినుటయేగాక యీ శతకమును పూర్ణముగా జదివితిని. ఇందలి శాంకరీ భక్తిభావము నిర్వ్యాజ సుందరము. వీరి పద్యధార నైసర్గికమైనది. సాత్త్వికమైనది.

"శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచేదేవం దేవో నఖలు కుశలః స్పందితుమపి."

జగద్వ్యాపారమునకు పరాశక్తియొక్క కారణత్వము బహుముఖములుగా సముద్ఘోషిత మగుచున్నదే. సృష్టిస్థితివిలయములకు ఆమెయే ఆది కారణము. త్రిమూర్తులు, సమస్త బ్రహ్మాండము; సకల జీవరాశి పరాశక్తివలననే సృష్టింపబడుచున్నారన్నిశాక్త సిద్ధాంతము.

అద్వైతాచార్యులు శంకర భగవత్పాదులును, మాయారూపశక్తి సాహాయ్యములేనిదే పరమాత్మయు సృష్టిస్థితిలయములు చేయజాలడనియు, కదలనైనఁ గదలలేఁడనియుఁ జెప్పియున్నారు. మాయ సదసద్విలక్షణము. గుణత్రయ స్వరూపమై జగత్సృష్టి చేయుచున్నది.

శంకరులు అనేక ప్రకరణ గ్రంథములలో ఆయా సందర్భములందు పరాశక్తిని స్తుతించియున్నారు.

ప్రకృతము : ఈ శతకకర్త సౌందర్యలహరి, భజగోవింద శ్లోకములు, దక్షిణామూర్తిస్తవము మున్నగు నాచార్యపాదులకృతులు మననము చేసికొనుచు, శంకరాద్వైతము నవగాహము గావించుకొనుచు నిష్కలుషమైన పరాశక్తి భక్తితో ఈ పద్యములు వ్రాసియున్నారని పాఠకులు గ్రహింపఁగలరు.

శాంకరీ భక్తికి దీటైన పద్యరచనా రక్తితో దీపిల్లుచున్న యీ శతకమును వ్రాసిన శ్రీ శాస్త్రిగారి నభినందించుచున్నాను.

—మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.



వారణాశి గంగాధరశాస్త్రి

కొవ్వూరు, ది 12-12-1981

శతకమనగా నూరు పద్యముల గ్రంథము. సంస్కృతాంధ్రముల యందుఁజక్కని భాషాజ్ఞానము సంపాదించి కవితాభిలాషులైన బుద్ధిమంతులు నిజకవితాధారాభివృద్ధికి భక్తితో, భగవత్ప్రార్థనా రూపముగనో, నీతిని నిరూపించునైపుణ్యముననో భగవంతుని నభివర్ణించు పద్ధతినో బూని శతకములవ్రాసి తమ విజ్ఞానము నభివృద్ధిపరచు కొందురు. కృష్ణ శతకము, కుమార శతకము, సుమతి శతకము నీ పద్ధతిలోనివి. ఇంతకు మున్నే కవితాభ్యాసమునంది, నలిగి, చేయిదిరిగిన పండితకవులు తమ యభీష్టదేవతల నభివర్ణించు దృష్టితోనో నీతి శృంగారాదుల వివరించు నూహతోనో ధూర్జటి, భర్తృహరి మొదలగు వారివలె నభ్యస్తకవులై శతకముల వ్రాయుదురు. ఈ యుభయవిధకవుల యాదరాశయమున

నాంధ్రభాషలో శతకవాఙ్మయ మభివృద్ధి పొందినది. కొందరు ఏదోయొక మకుటము నాధారముగ జేసికొని. ప్రతి పద్యము నా మకుటముతో బూర్తిగావింతురు. అన్నియును నా మకుటములోనే యలరారుచుండును.

ప్రకృతమున నీ కవిగారు. "శాంకరీ"యను మకుటమును గ్రహించి అద్వైతపరముగ శతకమును రచించిరి. వీరు అభ్యస్తకవులు. వీరి పద్యములలో కవితాశైలి, శయ్య, పదసంవిధానము, చక్కగనున్నవి. అభ్యాస కవిత్వముగాలేదు. భావశుద్ధి గాంభీర్యము నొకదానినొకటి మించియున్నవి. 'శాంకరి' పరతత్త్వ స్వరూపిణియని యామె మహిమను చక్కగా వర్ణించిరి. మనుజుడామెను ప్రార్థించి కోరవలసిన ముక్తిని నిరూపించుచు ముక్తి ప్రదాయినియగు నామెశక్తిని, నిరూపించిరి. ఈ శతకము చదువువారి కద్వైత బుద్ధి కలుగుట కాశ్చర్యములేదు.

అందందు వేదాంత విషయములు, యోగశాస్త్ర రహస్యములు, చివర వఱకు తత్త్వ విషయములనుదెల్పుచు నద్వైతభావమును బాగుగా నిరూపించిరి. ఈ శతకమునేగాక శ్రీ శాస్త్రిగారు మున్ముందు నితోధికముగ లోకాభివృద్ధికరములగు రచనలను రచింతురుగాతయని యాశించుచు విరమించుచుంటిని.

—వారణాశి గంగాధరశాస్త్రి.
(Rtd.) గౌతమీ విద్యాపీఠ సంస్కృత కాలేజి
ప్రిన్సిపాల్ (రాజమండ్రి)

❦ ❦ ❦

## ర చ యి త జ న ని జ న కు లు



శ్రీ వంగర గోపాలకృష్ణయ్యగారు * శ్రీమతి ఆదిలక్ష్మికామేశ్వరిగారు

# ధన్యవాదములు

నా యీ గ్రంథ రచనకు చేదోడు వాదోడుగా నుపకరించిన నా మిత్రులు ఆరాధ్యబ్రాహ్మణులు, వీరశైవాచార సంప్రదాయజ్ఞులు నిత్య శివ పూజారతులు, శ్రీ విద్యోపాసకులునగు శివశ్రీ తాడికొండ నాగమల్లయ్య గారికి (గుంటూరు)

నా మిత్రులు సహోద్యోగులు "ప్రౌఢకవి" శ్రీమాన్ తిరుమల వింజమూరి పార్థసారధి అయ్యంగారికి (కొవ్వూరు) నామనఃపూర్వక కృతజ్ఞతాభివందనములు.

సాహిత్యప్రియులు ఆస్తికభావసంపన్నులు వారికున్న అభినివేశముతో నా యీ గ్రంథప్రథమప్రచురణకు సముచిత సలహాల నొసంగి యథాశక్తి సహకరించిన

శ్రీయుతులు చట్టి హనుమంతరావు (విజ్జేశ్వరం)

పి. వి. రమణరావు (విజ్జేశ్వరం)

Sri P. V. R. K. Prasad (Executive Offieer) &

Sri K. Subba Rao (Editor) T. T. Devasthanams Tirupathi.

శ్రీ మారుతీ సీతారామధ్యానమందిర సంస్థాపకులు

బ్రహ్మశ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి - జయశ్రీటాకీస్‌రోడ్ రాజమండ్రి.

"శంకర గ్రంథ రత్నావళి" ప్రకాశకులు బ్రహ్మశ్రీ

బులుసు సూర్యప్రకాశశాస్త్రి సాధన గ్రంథమండలి - తెనాలి.

## I. T. C. Ltd. I. L. T. D. Division :

Sri G. Ramanand (Mysore)
Sri H. V. Ramana (Guntur)
Sri P. V. Siva Rao (Rajahmudry)
శ్రీ ఎల్. వి. వి. సత్యనారాయణమూర్తి (రాజమండ్రి)
శ్రీ బి. యల్. కాంతారావు (రాజమండ్రి)
శ్రీ కొమ్మ సుబ్బారావు (కొవ్వూరు)
శ్రీ బి. వి. పార్థసారధి. (రాజమండ్రి)
శ్రీ బులుసు సూర్యనారాయణమూర్తి (రాజమండ్రి)

ఐ. యల్. టి. డి. స్టాఫ్ అసోసియేషన్ ప్రభృతులకు నా హృదయపూర్వక ధన్యవాదములు. జగజ్జనని శ్రీ శాంకరి యీ ధన్యాత్మ లందరకు ఆయురారోగ్య సుఖశాంతులను ప్రసాదించి చల్లని చూపుల సర్వదా సంరక్షించుగాత.

రచయిత.

# నివేదనము

పరమాత్మశక్తియే పరాశక్తి. ఆ అనాదిశక్తియే మహామాయ, మహాలక్ష్మి, మహాదేవి, సరస్వతి ; సమస్తమునకు యాధారమైన శక్తి యగుచు, యొక్కటెగానేయుండి జగత్తును సృష్టించుట యనెడి లీలచేత (ఇచ్ఛా, జ్ఞాన, క్రియారూపముల సత్వరజస్తమోగుణములు గలదై) యొక్కటిగాను, అనేకములుగానుండు జగములుగా వృద్ధి నొందుచున్నది.

"నారాయణ శ్శివోవిష్ణుః శంకరః పురుషోత్తమః
ఏతేషు నామభిర్బ్రహ్మపరం ప్రోక్తం సనాతనం"

అనురీతిగా అనిర్వచనీయమైన ఆదిశక్తినే మూలప్రకృతియని, యవ్యక్తమని, విద్యయని, అవిద్యయని, అజ్ఞానమని, తమస్సని, సుషుప్తి యని, ప్రధానమని, ప్రళయమని యాయా స్థలములబట్టి బ్రహ్మవేత్తలు నుడివెదరు. పరమార్థరూపమా ! నిర్గుణతత్వమే జగన్మాత నిజస్వరూపము. పరమాత్మస్వరూపిణిని శక్తిగను (ప్రకృతిగను), పరమాత్మను శక్తి మంతునిగను (పురుషునిగను) తత్త్వబోధకాాలకు చెప్పుదురు.

శ్లో॥ "విరించ్యాదిభిః పంచభి ర్లోకపాలైః
సమూఢే మహానన్ద పీఠే నిషణ్ణమ్
ధనుర్బాణ పాశాంకుశ ప్రోతహస్తం
మహస్త్రైపురం శంకరాఽద్వైత మవ్యాత్".

(శ్రీమచ్ఛంకర భగవత్పాదకృతమ్)

శ్లో॥ "వాగర్థా వివసంపృక్తౌ - వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌవందే - పార్వతీ పరమేశ్వరౌ"

(రఘువంశం)

శ్లో॥ "శివేనచ వినాదేవీ - దేవ్యాచన వినాశివః
నైతయోరంతరంనాస్తి - చంద్ర చంద్రికయోరివ"

(కామకలావిలాసము)

యనునట్లు "శక్తి శక్తిమతోరభేదః" యను వాక్యానుసారముగా శక్తికిని, శక్తిమంతునకును భేదములేదు. పరమాత్మ సర్వశక్తి సంప న్నుడు. పరమాత్మ శక్తియయిన పరమేశ్వరిని స్తోత్రముజేయుట, పర మాత్మను స్తోత్రము జేయుటేయగును.

బ్రహ్మాత్మైక్య జ్ఞానాకారవృత్తియే యాజగజ్జనని ! జీవబ్రహ్మల యేకీభావమునకు గారణమగుచు వైరాగ్యము, ఆత్మజ్ఞానము, ఐశ్వర్యము, యనంతవీర్యము, మహాయశము, సంపూర్ణ సంపదయుగలిగి, పూర్ణకారుణ్యము, శమము, దమము, మహాతేజస్సు, మహాతపస్సు, సత్యము, శౌచము, ధైర్యము, సహనము, నిష్కాపట్యము మొదలగు గుణములతో సత్యజ్ఞానానందమయయు అవ్యాజ కరుణామూర్తియు, వాంఛితార్థప్రదాయినియు యగుచున్నది.

"యత్రైవ భోగో నహితత్ర మోక్షో,
యత్రాస్తి మోక్షో నహి తత్ర భోగః
శ్రీ సుందరీ సేవన తత్పరాణాం,
భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ."

(ఎచ్చట భోగముండునో అచ్చట మోక్షముండదు. ఎచ్చట మోక్షముండునో అచ్చట భోగముండదు. శ్రీ త్రిపురసుందరీదేవిని సేవించు వారలకు భోగమును మోక్షమును కరతలామలకములు.)

చిదగ్నికుండసంభూతయు, శివాశివశక్త్యైక్యరూపిణియునగు శ్రీమాతను శ్రీమాతను అద్వైతసిద్ధాంతపరముగ నుపాసించుట యనాదిగా వచ్చుచున్న వైదిక సాంప్రదాయము ః ఇదే శ్రేయోదాయకమగుచున్నది. ఇందుఫలము జీవన్ముక్తియే ః

పై భావములను మననము జేయుటకొఱకు లిఖితపూర్వముగ భద్రపరచుటయే నాయీ చిన్నప్రయత్నమునకు కారణము. దీనిని సహృదయులందఱూ నాదరించెదరుగాక.

రచయిత.

# శ్రీ చక్రమ్



బిందుత్రికోణ కాష్టావతార
యుగలోకపత్ర వృత్తయుతమ్ ।
వసుదళవృత్త కళాదళ
వృత్తత్రిమహీగృహం భజే ॥

శ్రీగిరి మల్లికార్జునుని చెంతను జేరిన నీ వెలుంగుచే
నాగత నీలకాంతి ధవళాంశుని లింగము నావరింపఁగా
రాగము మీరి భక్తులు పరాంబిక మాభ్రమరాంబయంచహో!
సాగిల మ్రొక్కి వేఁడెదరు శంకరు దివ్యవిభూతి శాంకరీ!

నిరుపమభక్తితో నమరునిశ్చల యోగసమాధినిష్ఠలో
శిరమున యామినీపతిని, శీతలగంగను, ఫాలనేత్రమున్
గరముల శూలమున్ డమరుకంబును, మేనున నిన్నుఁదాల్చుశం
కరుఁగని ముక్తులౌదురు జగమ్మున యోగిగణంబు శాంకరీ!

కరుణను బ్రోవుమంచు లయకారుని, శర్వుని, నిర్వికారునిన్
బరమశివున్, హరున్, భవుని, భర్గుని, భీముని, కాలభైరవున్
నిరతము నార్తితో మదిని నిర్మలభక్తి రహింప మ్రొక్కఁగా
నరయగ నిన్నుఁగొల్చుటగు నాంతరశక్తిని బట్టి శాంకరీ!

ఏనే రూపమునెంచి కొల్వనగునో! యేరీతి నీవుంటివో!
యేనే మంత్రము నుచ్చరించవలెనో! యీవెందువర్తింతువో!
యేనే యంత్రము పూజజేయదగు! నందే దౌను నీకిష్టమై!
యేనే తంత్రము చేయఁజాల సకలంబీవౌటచే శాంకరీ!

ఎంచన్ స్వాత్మవు సర్వవర్ణముల కీవే సర్వమంత్రాత్మికా !
యెంచన్ మూలము సర్వగీతలకు నీవే సర్వయంత్రాత్మికా !
యెంచన్ మర్మము సర్వశాస్త్రముల కీవే సర్వతంత్రాత్మికా !
యెంచన్ సర్వము నీవయౌనటుల నీవే సర్వమున్ శాంకరీ !

బిడ్డలఁగన్న యంబవని, పెన్నిధులిచ్చెడి లక్ష్మివంచు, ఁబే
ర్వడ్డ యనాదిశక్తివని, పల్కులతల్లివటంచు, నెన్నియో
దొడ్డరికంపుటూహలను దోఁచెడి నిన్నుభజించి గొల్తు నా
యెడ్డవసించుటౌ కతన నీవు మనోన్మనివంచు శాంకరీ !

అమ్మరో ! యాదిశక్తివయి యంతటనిండియుఁ గాశికాపురిన్
సమ్మతి జ్ఞానభిక్షనిడు శంకరురాణిగ నన్నపూర్ణవై
నమ్మిన సర్వసంపదలు నర్మిలినిచ్చి సుధాప్రపూర్ణవై
మమ్ములఁ బ్రోతువెప్పుడును మాయిలువేల్పుగదమ్మ శాంకరీ !

తెల్లము శక్తిసంపద, యతీశ్వరదేవుఁడె యాదిభిక్షువై
యల్లదె వారణాశి మునులచ్చెరువందఁగ నిన్ను వేఁడె ! నా
యుల్లము ఝల్లుమన్నదది యువ్విళులూరు వినంగగాథలున్,
దల్లివి లోకమాతవు సుదారదయాబ్ధివి నీవు శాంకరీ !

కొలువఁగ విష్ణుమూర్తినినుఁగోమలిరూపముఁ దాల్చియాశివున్
వలవఁగమోహపెట్టె, రతివల్లభుడావిధి నిన్నుమ్రొక్కితాఁ
జెలికనుదోయికిన్ దగినచెల్మినిగూర్చె మనోహరంబుగా
నిలగల మౌనిపుంగవులు నింద్రియలోలురుకాఁగ శాంకరీ!

మృదువౌఁబూవిలు, నమ్ములన్ననయిచే, మిత్రుండువాసంతుఁడౌఁ
గుదురుం గుంపటిలేని తుమ్మెదలచేఁగూడెన్గదా నారియున్,
ముదమౌ నాయశరీరి మారుడు మహామోహంబు పుట్టించుట
న్నది నీ పంచదశాక్షరీ జపమహీయస్ఫూర్తియే శాంకరీ!

దివ్యము నీదు విగ్రహము దేవునిసైతము మోహపెట్టు, మం
తవ్యము నీదునామమది తారకమంత్రమునౌటఁజేసి, వ
క్తవ్యము నీదు లీల లిలఁగారణకార్యములెన్నినీవెగా!
భావ్యము, కీర్తితవ్యమును, భవ్యము నీచరితంబు శాంకరీ!

పున్నమినాటి చందురునిఁ బోలినమోము, ధ్వనించుకాంచియున్
బ్రన్నని కుంభికుంభములపాటి కుచంబులవంగు దేహమున్,
సన్నని మధ్యభాగమును, జాపశరమ్ములుఁ బాశమంకుశం
బున్న చతుష్కరంబులు నహో! తనరారెడి నీకు శాంకరీ!

కలువలవోలు నీసొగసుఁగన్నులదీప్తిని జూచినంతనే
వెలవెలఁబాఱి గుట్టునిఁక వెల్లడియౌనని మీనముల్సదా
యులుకుచు, సిగ్గుముంచుకొన నోర్వక నీరమునందుదాగె, నీ
సలలిత నేత్రరమ్యతను శర్వుఁడు శాంతుడుకాడె శాంకరీ !

కర్ణములంటి కన్పడెడుకన్నుల మూటినివెట్టుకొటుకే
వర్ణమనంగ, నయ్యది త్రివర్ణములై త్రిగుణంబులేమొ, సం
పూర్ణులు ముప్పురీశ్వరులు పుట్టుటకోయనునట్లు దోఁచు, స
ద్వర్ణవిభుత్వమేర్పడఁగఁ బాలనసేయుదువీవు శాంకరీ !

పట్టినపట్టువీడనిఁక, బంతముకాదిది, నాదుజీవితం
బట్టిటునూఁగసాగెను, వయఃపరిమాణము తగ్గుచుండె, నే
నెట్టుతరింతునో యెఱుఁగనింత భవాంబుధి. నెట్లుబ్రోతువో !
గట్టిగ నిన్నెకొల్చెదను కష్టముబాపెదవంచు శాంకరీ !

తల్లియుఁ దండ్రియున్ గురుఁడు,దైవము, సర్వమునీవెయంచునా,
యుల్లముదెల్ప నమ్మితినహో ! కరుణారససాగరా ! శివా !
వల్లభునంటిరమ్మ్మ - మురిపంబురహింప, నుపేక్షసేయకే !
చల్లనిచూపులందు దయఁసాగిన నాకదెచాలు శాంకరీ !

కోరిభజింతు నిన్నెపుడు కోర్కెలుదీర్పఁగగాదు తల్లిరో!
మారనిజీవయాత్ర పలుమారులు సేయఁగలేనివాడ, నీ
దారిఁబడంగఁగోరి, పయిదారుల వీడఁగనెంచి, పాటకా
ధారము కీర్తనల్ సలుపు దారులజూపుము నాకు శాంకరీ!

నాహృదయాంతరాళముననాటిన నేటి విశాలభావమే
దేహముమీది మోహమును, ద్వేషపుఁ జింతన, పాపకృత్యముల్
దైహికవాసనల్ దునుమఁదానొక యంకుశమై సదా "త్వమే
వాహ"మటంచు నాహృదయవాసనలన్నిఁటిమార్చె శాంకరీ!

ధారాశుద్ధియులేక, పాండితియనన్ దత్తుల్యమై, కల్పనా
ధారంబయ్యేడి కావ్యశోధన కలాతాత్పర్యమేలేనిచో
నౌరా! నీస్తుతిఁజేయనెంచఁ దరమా! యౌత్సుక్యమా! గొప్పగా
ప్రేరేపించితి; జ్ఞానదాత్రివిగదా! ప్రీతాత్మవో! శాంకరీ!

పదలాలిత్యముగల్గి, నాదుకవితా ప్రాశస్త్యమేపారఁగా
మదిలోనూరిన భావనాతతులరమ్యంబౌ తరంగాలలో
నుదయించెన్ నవరాగతాళముల ధ్వన్యుత్పన్న పద్యాలహో!
తుదిరూపంబిడె సృష్టిసామ్యమున నీస్తోత్రంబుగా శాంకరీ!

అమ్మా ! నాన్నయసంగుడై, చతురవీవా సృష్టికార్యక్రమం
బెమ్మాడ్కిన్ జరిపింతువో యనుచునిన్నీక్షింప(దాసాక్షియై
నమ్మాంజాలని నీదుకౌశలము నానారీతులన్ వెల్వడన్
సమ్మోహంబును జెందె శక్తియుతు(డై సంసారియై శాంకరీ!

వ్యష్టిసమష్టిరూపమున వ్యక్తమునయ్యెడి సర్వవిశ్వమున్
సృష్టిని(జేయుస్రష్ట, యది శ్రీపతియో యి సహస్రశీర్షు(డై,
నష్టముజేయుదానిని పినాకధరుండు, యదార్థమింతుకున్
స్పష్టము నీపదాబ్జగతపాంశువె సాధనమయ్యె శాంకరీ!

ఒక్కగుణప్రధానులగు నొక్కరు-నొక్కసదాశివుండుగా
కొక్కరుసాటిరారుగద యోత్రిగుణాత్మిక మువ్వురీశ్వరుల్,
మ్రొక్కనుపాస్య దేవతవు ముక్తినొసంగెడిశక్తి వౌటచే,
నిక్కపుబ్రహ్మరూపిణివి నీవెయటంచు( దలంతు శాంకరీ!

నిదురన్దోచని యాప్రపంచమగునే నిత్యంబు? కాదే! జడం
బిది? యున్నట్లుగుపించుచున్న యది తానీ జాగ్రదాత్మన్సదా,
యిదియే సత్ప్రతిబింబరూపమున( దానేపొరుసద్రూపమై,
విదితంబౌనిది నీప్రకాశకలనన్ వెల్గొందెడిన్ శాంకరీ!

నానాకారవికార భూతమయ విన్యాసంబునై, విశ్వమ
జ్ఞానాక్రాంత తమోగుణాధిక మహత్సంజాతమై వ్యక్తమై,
నానారీతుల నామరూపములఁగానన్ జిత్రమై, భోగ్యమై,
ధ్యానంబందున నశ్వరమ్మగునటంతర్భూతమై శాంకరీ!

గగనము నీలమంచెటుల కల్పితమైనది? శూన్యమయ్యె. నా
కగుపడు పాముచిల్వదెటులయ్యది త్రాడనిగుర్తెఱుంగఁదా
నగునెటుశుక్తి? వెండివలెనజ్ఞతచేఁగద! తోఁచునన్యమై,
జగమదిమిథ్యయైచనదె? సర్వముబ్రహ్మముకాఁగ శాంకరీ!

అరయమూడువ్యాహృతులయారె! తపంబిడ నుద్భవించె నోం
కారమనంగత్ర్యక్షరి "అకార" "ఉకార" "మకార" సంజ్ఞలై
సారెకనాహతంబున పసందుగమ్రోగెడి ఘంటికాధ్వనిన్
ధారణచేయుచో దశవిధంబులఁ దోఁచెడునద్ది శాంకరీ!

అచ్చులు శక్తివర్ణములు, హల్లులు సాశివునక్షరంబులౌ,
నచ్చెరువందనోటఁబడి యయ్యవివాక్కులనుకాఁగ, నద్ది బల్
ముచ్చటనయ్యె విశ్వముగ, మూలమునాశివశక్తితత్త్వమే
యచ్చట నర్థవాక్కులయి యాకృతిఁదాల్చెనుజూడ శాంకరీ!

విత్తున నంకురమ్మువలె విశ్వము మున్నుగ నిర్వికల్పమై
చిత్తుననుండి, కాలమున చిత్రగతిన్ దనరారునెంతొ గ
మ్మత్తుగ నామరూపచయ మంజుల ముగ్ధత గొల్పిభిన్నమై,
మొత్తపు సృష్టివృద్ధిలయమూలక మీవగుచుండ శాంకరీ!

ఒక్కటెయాడదయ్యు, మదినొప్పగన త్తయు, దల్లి,యక్కయై
యొక్కనికొక్కరీతినగుచున్నది, యొక్కటిదోఁచు పెక్కులై,
టక్కరి ఐంద్రజాలమున టక్కుటమక్కులు జేయజాలఁడే!
నిక్కము నింత విశ్వమును నీదగుమాయగదమ్మ! శాంకరీ!

కుండకునుండు రంధ్రములగుండ ప్రసారితదీపకాంతి, లో
నిండి బహిర్గతంబగుట నిక్కము, బొందిననీవె యాత్మవై
నిండుగ నంతరంగమునునిండ, మహోజ్జ్వల కాంతిపుంజముల్
మెండుగ విశ్వమంతటను మీటగ వెల్గుజగంబు శాంకరీ!

ఉన్నదియొక్కటేయగుట, నూహలుజేసిన రెండునుండునే?
కన్నప్రపంచమంతయును గన్పడు నద్దముతోనిబింబమే,
తిన్నగఁదన్ను దాఁగనినతీరున, బ్రహ్మములోని విశ్వమున్
గ్రన్ననవేతె చూచుటది జ్ఞానవిహీనతకాదె శాంకరీ!

ఆకాశంబది నాభియై, దివిశిరంబై, భూమియున్ బాదమై,
యాకర్ణంబులు దిక్కులై, శశిధరుండాదిత్యుఁడుం గన్నులై
యాకర్షించు ముఖంబు వాయుసఖుడై, యావాయువే ప్రాణమై
సాకారంబున విశ్వరూపిణిగ నీవారాధ్యవౌ శాంకరీ !

ఆధారంబున భూమి, నీరు మణి పూరాబ్జంబునం, దగ్నియున్
స్వాధిష్ఠానమునం, దనాహతమునే వాసంబుగావాయువై,
యాధీరూపిణిమాయ, యాప్రకృతి యాజ్ఞాంభోజమందుండ ఖం
బాధారమ్మగగై కొనెన్ సరి విశుద్ధాబ్జంబునే శాంకరీ !

తరుణిగ చీరకట్టి, తకతయ్యని నాట్యముసల్పునార్యుఁడున్
బురుషుఁడుగాక నాతలిరు బోఁడగునే పరికింప నేర్పుతో,
దొరకాని విశ్వరూపమునఁ దోఁచు విధాత్రియువిశ్వమౌనె ! సు
స్థిరమతి నీవె సర్వమని చింతిల నీవవెదోఁచు శాంకరీ !

ఘటమున నామరూపములు కల్పితమౌటను మిథ్యయైచనున్,
ఘటముననున్న దంతయును గాంచగ మృత్తికగాక యొద్దియౌ ?
ఘటమన మృత్తికేయగును, కారణమే యటు కార్యమౌటచేఁ
బటుతర విజ్ఞతన్ జగము బ్రహ్మమయంబుగఁ దోఁచు శాంకరీ !

కటకముఁజూడఁగా నదియుఁ గాఁచనమౌను, తదన్యమెట్లు ? తా
నటులనె కార్యమైన కడియంబుకు కారణమైన బంగరం
బెటులను వేఱుకాదొ, జగమెంచగ బ్రహ్మమె హేతుధృష్టిచే,
స్ఫుటతర నామరూపములు పోవమి బాధకమెద్ది ? శాంకరీ !

శివశక్త్యాత్మక మీజగత్తు, నుదయించెన్ గాలమాసన్నమై,
యవసానంబునఁ గానరాక, మరినవ్యక్తంబు వ్యక్తంబుగా
నవతారంబును దాల్చు, నయ్యెడల మూలాజ్ఞానమేతానుగా
నవరోధంబుగ నిల్చు "వేరె" యని యన్యాభాసమై శాంకరీ !

తీరమునంటి పైకుబికి తేలెడుఫేన తరంగ బుద్బుదం
బారయ నబ్ధికన్నఁ బరమౌనన నెద్దియుఁగాననేర దా
కారముబట్టి పేరిడుటఁగాంతుము, సృష్టియునింతయౌచు సొం
పారఁగ నామరూపములు నాత్మకుఁగల్గెనుకాదె శాంకరీ !

రాగిదియైన విగ్రహము రాగికి వేఱుగదోచు భ్రాంతిచే;
నీగతి నాత్మనుండి యుదయించు జగత్తును దోచువేఱుగా,
నేగతిలోహఖండము మహేశ్వరుజీవులవోలెదోచునో
యాగతి నాలుబిడ్డలుగ నాత్మను దోచు జగత్తు శాంకరీ !

పూర్ణమునుండి పెక్కులిలఁ బుట్టుచు వృద్ధిని జెందిమాయమై
పూర్ణమునందుఁ జేరుఁ బరిపూర్ణతచెందుచునుండి, యట్టిచో
బూర్ణము పూర్ణమైచనును, పోఁగొనదెట్టిదిలేశమైన, సం
పూర్ణమె యద్ది యిద్దియును, బుగ్గయె యేఱయిపాఱు శాంకరీ!

జడమై, భూతసుషుప్తియై, భ్రమయు, నజ్ఞానంబునై, మిథ్యయై,
పెడత్రోవన్బడి జీవభావము సదా పెంపొందఁ దన్మూలమై,
కడుఁ జిత్రంబుగ సర్వభూతవితతిన్ గల్పింపగాహేతువై,
కడకున్లేనిది యౌను మాయగద సుజ్ఞానంబునన్ శాంకరీ!

లేనిదియున్నయట్లుఁ గడులీలగ నున్నది లేనియట్లు, లో
కానకుఁ దానుమూలమయి కల్పనచేయుచునుండు నెప్పుడున్,
గానిది యౌనటంచుఁ బొడగట్టగఁ జేయు నసత్తుసత్తుగా
మానసమందు మాయ యనుమానము గల్గఁగ నీదుశాంకరీ!

భేదంబుండదు బీజవృక్షములకున్, బీజంబెతావృక్షమౌ,
నాధారంబగు గింజకందెలయు నాయాధేయమౌశక్తికిన్
భేదంబుండునె? మాయతానటుల జృంభించున్ జగద్రూపమై
యాధారంబగు నాత్మయందమరి యవ్యక్తంబునై శాంకరీ!

అరయన్ సృష్టికిఁ బూర్వముండదపుడా యాకారమవ్యక్తమా ।
పరిణామమ్మున విశ్వరూపమున సంభావింపఁదావ్యక్తమా ।
యరుదై యొక్కటి రెండుగాఁ జనక వ్యక్తావ్యక్త దుర్జ్ఞేయమౌ
దగమే నీదరి మాయనెంచఁ బరమార్థంబెట్టిదో శాంకరీ ।

మాయావిద్యలుగాగ నాప్రకృతి, బ్రహ్మంబందు బింబించ, నా
మాయావిద్యలు, నందుబింబములు, బ్రహ్మంబౌను జీవేశ్వరుల్,
మాయోపాధిగనున్న నీశుఁడన, బ్రహ్మంబే యుపాధిన్ గదా
యాయెన్ జీవుఁడవిద్యగూడి, ఘనవేదాంతంబిదే శాంకరీ ।

పాపోహమ్మని, పాపశీలిననుచున్ పాపంపు భావాలచేఁ
బాపాత్మస్థితి "జీవ" భావమును, తద్భావానుగుణ్యంబుగాఁ
బాపంబేగదప్రాప్తమౌను ! మఱి సద్భావంబు శ్రేయంబుగాఁ
దోఁపన్ ముక్తికి దారిజూపునది చిద్రూపంబయౌ శాంకరీ ।

బాల్యము నాటపాటలను, ప్రౌఢమునంగనలందురక్తిఁ ద
త్తుల్యముగాను వృద్ధతయు దుర్భరచింతలలోనుగాగ-వా
త్సల్యమె యన్యథాబరగి తత్త్వమెఱుంగక తల్లడిల్ల, గై
వల్య మనంగనెక్కడిది ! బ్రహ్మముదోచునె యెందు ? శాంకరీ ।

పుత్ర కళత్ర బాంధవులు పుష్టిగ నార్జనజేయునప్పుడే
ధాత్రినిఁ బ్రేమజూపుదురు, దైన్యము వార్ధకమావహింప, నే
మాత్రము నెట్టులుంటివను మాటనునైతము పల్కరారహో !
చిత్రపు మోహపాశమున జీవుడు తానుగచిక్కె శాంకరీ !

ఎక్కడిబంధమో ! భవము నెక్కువజేయుచుగూర్చె మోహమిం
కెక్కడిమోహమో ! నగమునెక్కెను స్వార్థముహెచ్చిభ్రాంతిచే,
యెక్కడిభ్రాంతియో ! కనదదెక్కసమై నిజమెంతయేని, నిం
కెక్కడి మార్గమమ్మ ! తలకెక్కదుతత్త్వము నెందు శాంకరీ !

ఆశాపాశము వీడనొల్లక సదాయారాటమున్ జెందుచున్
లేశంబైనను తృప్తినొందక మనఃక్లేశంబుతో జీవుఁడా
వేశంబొందుచుఁ జేయు దుష్కృతములన్ వేమారు నజ్ఞాన దు
ష్పాశాబద్ధత జీవనంబు గడుపున్ బాపాత్ముడై శాంకరీ !

జటలంబెంచిన ముండియై చనిన, కాషాయంబులన్ గట్టినన్
గటిఁగౌపీనముఁ దాల్చినన్, విసిగి దాఁగాంతారమందుండినన్
ఘటికుండై హఠయోగసిద్ధులను దిగ్భ్రాంతిన్ బ్రదర్శించినన్
బటుసుజ్ఞాన విహీనతన్ బరము సంపాదించునే శాంకరీ !

తమ్మెఱుంగ లేకనుచితమ్ముగ దేహమె తామెయన్నభా
వమ్మ మనమ్మునన్నిలిపి, ప్రాణము మానధనమ్ములందురా
గమ్మె వహింప, మోహమటు గ్రమ్మగఁబెంచుచునుండు దామసం
బిమ్మహి, మోహనాశినివి! వృద్ధవు! నిన్దలపండు శాంకరీ!

మనసా! నిల్వదు కోతిచందమున గొమ్మల్బట్టి యూఁగాడెడిన్
గనులా! గాంచవు సత్యమెన్నటికి నేకర్మంబు వెంటాడెనో
తనువా! రాలును పండువోలె భువి నాధారంబు వీడంగనే
యని భావించుచు నిత్య సత్యవగు నిన్నర్థించెదన్ శాంకరీ!

అరరే! మానసమెంత చిత్రము! చింతాక్రాంత శోకాంబుధిన్
దరియేగానక మున్గుచున్నయది, సద్యస్ఫూర్తి లోపించెనే?
తరుణోపాయముఁ గాంచ నీదుపదముల్ ధ్యానించు నాసక్తితో
స్థిరమై త్ర్యక్షరి నుచ్చరింప దరినిన్ జేర్పంగదా! శాంకరీ

అన్యము జీవుడెట్లు? పరమార్థమునం బరమాత్మగాడె, చై
తన్య మదొక్కటైనను వితర్కమునన్ శివుడంచు జీవుడ
చన్యములైన భావముల నందఱు భ్రాంతిని జెంద లీలఁగన్
ధన్యచరిత్ర! చేతువు పదంపడినైక్యముఁ గూర్తు శాంకరీ!

అజ్ఞానంబను కారుమబ్బు మొదలై, యత్యంత నీరంధ్రమై
ప్రజ్ఞానంబను సూర్యునడ్డుఁగొనఁ బ్రాప్తంబౌ తమస్సున్, సుత
త్త్వ జ్ఞానంబను చండమారుతమునన్ వారించి, జీవేశ్వరై
క్య జ్ఞానంబును బొందగా, నిడవె మోక్షంబంతటన్ శాంకరీ !

పుట్టుచుఁ గిట్టుచున్ మరలఁబుట్టుటకే నొక మందబుద్ధినా ?
పుట్టుక కారణంబెఱుగఁ బుట్టితిఁ బట్టితి జిద్విలాసినిన్,
దట్టెను బుద్ధికిందు పరతత్త్వము, జన్మము ధన్యమైతగన్
గిట్టక నేను నేనగుదుఁ గేవల ముక్తివరింప శాంకరీ !

గర్భమునందునున్న పసికందు తపంబిడనెంచునేమొ ? యా
విర్భవ మందకుండ నెటువిజ్ఞతనేర్చెనొ ? ముద్ర నిద్రలన్,
నిర్భయ నిర్వికారత గణింప దిగంబరయోగియౌగదా !
నిర్భరుడై సుయోగమును నేర్చుఁ బతంజలివోలె శాంకరీ !

"అ" యనెడి బ్రహ్మమే "హ" యనునాంతరశక్తినిగూడుటంగదా!
నియతినహంబునైతి నేనుపాధుల వెల్గుజీవినై,
భయమదియేల ? యెల్లపుడు భద్రుఁడు, నేశివశక్తియుక్తిచే
నయితిని నాదరూపినిగ, నక్షరరూపినిగాను శాంకరీ !

తలపన్ గామ వికారమెక్కడిది ? వార్ధక్యంబు వాటిల్లుచో ।
జలశూన్యంబగునేని నెక్కడిది కాసారంబు ? విత్తావశుల్
తొలగంగా పరివారమెక్కడిది ? చేతోవీథితత్త్వార్థమున్
దెలియన్ సంసరణం బదెక్కడిది ? చింతింపన్ మదిన్ శాంకరీ !

ఎక్కడ ? జన్మమృత్యుభయమేను శరీరముగాని యప్పు, డిం
కెక్కడ ? క్షుత్పిపాసయుగమేననఁ బ్రాణముగాని యప్పు, డిం
కెక్కడ ? శోకమోహములవేయను చిత్తములేకయుంట, నిం
కెక్కడ ? బంధమోక్షముల కే నెటుకర్తనుగాను శాంకరీ ।

గంతను గాను, నేనటులెకర్తయు, భోక్తయు, వక్తఁగాను, నే
నంతర వృత్తిరూపినిగనైన విధంబున నట్టి వృత్తులన్
మంతనుగాక భాసిలెడు మంగళమూర్తి శివుండగానె । నే
నుంతయు బద్ధ ముక్త పురుషుండను గానెఱుగంగ శాంకరీ !

నశ్వరమైన దేహముల, నశ్వర యౌవన దార్ఢ్యగర్వమున్
నశ్వర భోగభాగ్యముల నమ్మక జీవనయాత్ర సల్పుచున్
విశ్వవిధాత్రి నీశ్వరిని, విశ్వచరాచర సృష్టిహేతువున్
శాశ్వత సౌఖ్యదాయిని నజస్రము వీడకగొల్తు శాంకరీ !

స్వాంతములోన వేదములసారము నీవనినమ్మి, కర్మసి
ద్ధాంతముబట్టి, పాయక సదా విధికర్మములాచరించి, వే
దాంతిగమారి మానసపథమ్మున నిన్ను భజించి గొల్చు వా
డెంతయొ ధన్యమూర్తియగు నీప్సితసిద్ధిని బొంది శాంకరీ !

జాగ్రత్స్వప్న సుషుప్తులున్ గలుగ నజ్ఞానంబునన్ జీవుఁడా
జాగ్రత్తున్ గ్రహియించి స్వానుభవమున్ సత్యంబుగానెంచుచున్
వ్యగ్రుండై మను, నిగ్రహంబున తురీయావస్థలో నిన్ను నే
కాగ్రుండైకను నిర్వికారమున సాకల్యంబుగా శాంకరీ !

సారమునందు బుట్టియును సారసమేగతి సారమంటదో
సారవిహీన దుఃఖభవసాగర సంగతవృత్తియందు నా
చారు వివేకియున్ గడునసంగతమందుచు సారెసారెకున్
ధారణచే నినున్ గనుచు ధన్యతజెందునుగాదె శాంకరీ !

కరఁగదె యుప్పునీరమునఁ గన్పడకుండఁగ సామ్యమొందుచున్
బరిపరి నేనెబ్రహ్మమని బ్రహ్మమె నేననుభావసంస్థితిన్
బొరిఁగొన నొద్దికన్ విషయభోగములంతట వృత్తిశూన్యమై
యరయగ మానసాత్మల సమైక్యముకాదె సమాధి శాంకరీ !

బిందువెబుద్ధి, యందు ప్రతిబింబితబ్రహ్మము చిత్కళాఖ్యఁ బెం
పొందిన జీవుఁడౌను, వినుచుండెడి లోపలివాయుశబ్దమే
వింద గునాదమౌచుఁ గనువిప్పను గల్గఁజేయ, జ్ఞానియై
డెందమునందు యోగిగను తీవిగ సర్వముగాదె శాంకరీ!

మాయకులోనుగాక, చెడుమార్గముఁ ద్రొక్కక, సత్త్వవర్తియై
ధ్యేయము బ్రహ్మమౌచుఁ గడుధీరత గమ్యముగు ర్తెఱింగి తా
నాయువునుండు దన్కమనునంటియు నంటక జ్ఞాని వృత్తులన్
జ్ఞేయము, జ్ఞాత, జ్ఞానమును చేకొన నీవెయటంచు శాంకరీ!

పరిణామమ్మునఁ బెర్వుఁజిల్కుటను లభ్యంబైన వెన్నన్‌గనన్
బొరపొటైనను చల్లలోఁగలియునే? పొందింప యత్నించినన్
బరతత్త్వంబున మానసోపరతియున్ బ్రాప్తించి భోగించు వాఁ
డరయన్‌దాఁకునె యెవ్విధంబునను మాయాసంసృతిన్ శాంకరీ!

వెలయన్ జ్ఞానపుగంగవీవె, యరయన్ విశ్వేశుఁడేయాత్మ, ని
శ్చలయోగంబె ప్రయాగ, భక్తిగయయై సర్వంబులోనుండగా
దలఁపన్ దేహమెకాశియై తనరి తీర్థప్రాభవంబొప్ప, ని
ర్మలుడౌ జ్ఞానికినాడ నన్యమగు తీర్థంబేలనో శాంకరీ!

ఒకపువ్వంది భవత్పద ద్వయముపై నొప్పంగ, సద్భక్తి మే
రకు నెవ్వాడటులుంచునో యతని ప్రారబ్ధంబు క్షీణించుచున్
సుకముంగూడఁగ నిత్యతృప్తిఁగొనుచున్ శోభిల్లు వాఁడెంతయే
నిక సుజ్ఞానిని చెప్పనేమిటికిఁ దానీవౌనుగా శాంకరీ !

పదముల్ రెండుగనర్థమిచ్చు నవియే వాచ్యార్థలక్ష్యార్థముల్
పదవాచ్యార్థముఁ ద్రోసిపుచ్చి గ్రహియింపంజెల్లు లక్ష్యార్థమున్
బదలక్ష్యార్థమునందు తత్పదముఁ దెల్పంజూచు బ్రహ్మంబు,త్వం
పదముందెల్పును ప్రత్యగాత్మ, నసిశబ్దంబైక్యమున్ శాంకరీ !

వేదాంతంబు సుగమ్యమై తనరు భావింపంగ నద్వైతమున్
గా దాబ్రహ్మము ద్వందమెవ్విధి నిరాకారంబు సాకారమౌ
నాదాతీతము నాదరూపమున నన్వర్థంబునై దోచుచో
వాదంబెక్కడ ! బ్రహ్మనాదము, స్వరూపంబీవెగా శాంకరీ !

శివుడున్ లేనిది శక్తి లేదనిన స్వస్త్రీస్వాడి తానుండునే ?
యవుచో నవ్వరె శక్తిలేని శివునేయర్చించి యర్థించఁగా
నవకాశంబునులేని భేదమున వారన్యోన్య సంబంధులై
యవునా యిద్దరు చంద్రచంద్రికలు, వాగర్థస్థితిన్ శాంకరీ !

ఎంతోయోచనఁజేయనేల ? మొదలే యీవన్నదే లేనిచో
వింతల్‌గూర్చెడి యీజగద్వితతి యావిర్భావమెట్లౌను ? ర
వ్వంతేనిన్ నిను నాశ్రయింపజనఁడే బ్రహ్మంబు నీసృష్టికై
యంతా "మాయ" యనంగ నంతయును నీవై యుండుటే శాంకరీ !

అర్థాత్సిద్ధము శక్త్యుపాసనము, నయ్యారే ! యధిష్ఠానత
త్త్వార్థంబెంచఁగ బ్రహ్మనిర్గవయు నంతర్యామివై, లేనిచో
వ్యర్థంబౌ సముపాసనాసరళి భావంబందు నీలేమిచే,
నర్థంబౌ నుభయాత్మకంబనుచు బ్రహ్మత్వంబనన్ శాంకరీ !

శివుఁడై నన్ 'శివ'వౌచు, రుద్రుఁడయినన్ జెన్నారు రుద్రాణివై,
భవుఁడేగాగభవాని, శర్వుఁడయిదై వారంగ శర్వాణివై
యవతారంబు లతండు మారినను నీవారూపముల్ దాల్తు వీ
యవనిన్ శంకరుడాతడై నపుడు నీ వట్లౌదువో శాంకరీ !

శక్తుని శక్తినిన్ దెలుప శక్తిని మిన్నగఁజెప్పనొప్పు, నా
సక్తినిబాడి గాయకుఁడు సర్వులుమెచ్చ స్వశక్తిఁజూప, నా
వ్యక్తికిగాదు గౌరవము ఖ్యాతియుఁ గల్గుటయన్న, గాత్రపున్
శక్తికిగాదె ? శంకరుడు సాక్షియె, సారధి వీవు శాంకరీ !

# శ్రీ దుర్గ



నిర్గుణ నిర్వికారము, వినిర్మల చిద్ఘన నిత్యసత్యమున్
దుర్గతిఁబాపు సంపదయు, దుర్గమమౌ భవదీయతత్త్వమున్
దుర్గవు, దుఃఖహంత్రివటు దుష్టులఁజెండెడు చండిరూపవున్
భర్గుని వంటినుండు సిరి భార్గవి యన్నను నీవె శాంకరీ।

శక్తుండౌగద నిన్నుఁ గూడినపుడే శర్వుండు లోకేశుడై,
శక్తిన్‌పీడి చరింపగానగునె ? వీసంబైన దేవుండెపో !
భక్తిన్ మ్రొక్కరె యాత్రిమూర్తులు "మదంబాపాహిమా"మంచు స
ద్భక్తిన్ శక్తినిముక్తినీయవె పరాభట్టారికా శాంకరీ !

రూపంబెంచఁగ నీవె, వస్తువతఁడై రూపొందఁగా మిమ్ములన్
రూపేరూపియటంచు, రూపినటులే రూపంబుగానెంచి మే
మాపాదింపఁగ నిన్ను శంకరునిగా నద్వైతమై, పల్కరే
మీపేరెన్ని 'శివా'యటంచు బిలువన్ మీరిద్దరున్ శాంకరీ !

శివయన్నన్ శివుడన్న యంశమది యోచింపంగ నద్వైతమే
శివుఁడే శక్తి విశిష్టచేతనము-నాచిద్రూప సద్వస్తువున్
గవులూహింపుచు వ్రాయఁ జొచ్చుటరయన్, కామ్యార్థసంధాతగా
శివునెంచన్, శివశక్తిఁగై కొనుటయే చిద్రూపిణీ శాంకరీ !

పాలనువెన్నవోలెఁ బ్రతివాని శరీరమునందుదాఁగులో
జ్వాలనెఱుంగ, యత్నమునఁ బాలనువెన్నను వేఱుజేయు నా
వాలకమెంచి, యెట్టిదను భావపుఁగవ్వముతో మధించుచోఁ
దేలు నుపాధికంటదని తిన్నగ నాత్మయటంచు శాంకరీ !

జ్యోతియనంగ నెద్దియన, సూర్యుడు చంద్రుడునంచుఁ బల్కుచో
నాతని నీతనిన్ దెలియునట్టిది యెట్టిదియన్న, నేత్రమే
ద్యోతకమన్న, మాయనది దోఁచెడిదెద్దియ ? బుద్ధియన్నచో
నాతఱిదాని జూచునదె అద్వయమాత్మయె జ్యోతిశాంకరీ !

దేహశ్వాసల రాకపోకడల నుద్దీపించు చిద్రూపయై
యాహంసాఖ్య "శివా" పదార్ధగతి నార్యా ! హంసగాయత్రివై
సోహంభావనఁజేయ సర్వమును నీవౌనన్న భావార్థమై
యాహా ! దాగితివంతరంగమున నేనర్చింపగన్ శాంకరీ !

ఏదోప్రేరణ నేయుచున్నయది మాయావృత్తులన్ నిత్యమున్
గాదేనయ్యది బ్రహ్మతేజమగుచున్ గాయత్రి రూపంబుగా
బోధానంద సుఖ స్వరూపమున దా బోధించు నద్వైతమున్
దాదాత్మ్యంబున దాను నీవనుచు సంధ్యాదేవివై శాంకరీ !

నీవేయాత్మవు "నేనునే"నను చులో నిత్యంబుభాసిల్లుటన్
నీవే నేనగుదేను నీవగుదు కానేకాను దేహాదులున్
దావేలేదిఁక భ్రాంతిఁజెందుటకు నద్వైతంబు పాటింప నా
తావేనీదని దల్చుటన్ భ్రమరకీట న్యాయమై శాంకరీ !

భావంబుండినఁదోఁచు నీజగము తద్భావానుగుణ్యంబుగా
భావంబేయటు పూజ్యమైన యెడలన్ భాసింపదే లోకమున్
భావాతీతను భావనాపరిధిలో భావించుచే భక్తియై
భావింపంగనుగా కనాత్మనిఁక నిన్భావించెదన్ శాంకరీ!

శ్రుతిగా, బ్రాహ్మిగ, వాగధీశ్వరిగ, సంశోభిల్లుత్రీమూర్తిగా
స్మృతిగా, విద్యగ, శాస్త్రసారముగ, నిశ్చింతాత్మనిర్ద్వైతగా
ధృతిగా, ధీరగ, దైత్యహంత్రిగ, మహాదేవి! మహారూపిగా
మతిగా, మేధగ, శర్మదాయినిగ సంభావింతునిన్ శాంకరీ!

నిర్గుణ నిర్వికారము, వినిర్మల చిద్ఘన నిత్యసత్యమున్
దుర్గతిఁబాపు సంపదయు, దుర్గమమౌ భవదీయతత్త్వమున్
దుర్గవు, దుఃఖహంత్రివటు దుష్టులఁజెండెడుచండిరూపవున్
భర్గునినంటినుండు సిరి భార్గవియన్నను నీవె శాంకరీ!

నిరహంకార నిరీశ్వరీ! భగవతీ! నిష్క్రోధ నిర్లోభినీ!
నిరుపాధీ! నిఖిలేశ్వరీ, నిరుపమా! నిర్మోహనిస్సంశయా!
నిరపాయా! నిరుపప్లవా! నిరవధీ! నిష్కారణా! నిర్భవా!
నిరవద్యా! పరదేవతా! శివపరా! నిత్యా! నమశ్శాంకరీ!

నలుబది నాల్గుకోణములు, నల్వొరుశంఖువు, త్రైదుశక్తులా!
వెలయగ మూలకారణము-లెన్మిదియున్, బదియున్ బదాఱునౌ
దళములు, మూడురేఖలుగఁదాద్వశ సద్వలయంబులుండి భా
సిల, నిలయంబు నీకగును శ్రీయనుచక్రమునౌచు శాంకరీ!

హే! చారుస్మిత చంద్రబింబవదనా! హ్రీంకారమంత్రోజ్వలా!
శ్రీచక్రస్థితబిందు మధ్యనిలయా! శ్రీరాజరాజేశ్వరీ!
యాచింతామణి గేహమందలరు నార్యా! షోడశీ! శ్రీకలా!
శ్రీచిచ్ఛక్తివటంచుఁ గొల్చెద శివశ్రీ! శ్రీకరీ! శాంకరీ!

లలితవచో విలాసము విలక్షణ లక్షణ లక్షితంబు నీ
పలుకులు వేదమంత్రము, లవాఙ్మయగోచరమీవు, నిన్నులోఁ
దలచుచు భవ్యగీతములఁ దంత్రులమీటగ వాణి,యయ్యెడన్
దలయటులూపె బ్రహ్మ 'లలితా'యన నీవె యటంచు శాంకరీ!

శారదరాత్రులం వెలుగుచంద్రుని మోమటు నీదు మోమెటుల్?
"చారువిభావగర్భిత ప్రసన్న దయార్ద్రవిలోకనాది పం
కేరుహలోచనాయతముఖీ" యని పల్కినయుక్తమే మొకో!
శారదమాత వీవు మముఁ జల్లని చూపులఁజూడు శాంకరీ!

# శ్రీ అన్నపూర్ణ



అమ్మరో ! యాదిశక్తివయి యంతట నిండియుఁగాశికాపురిన్
సమ్మతి జ్ఞానభిక్షనిడు శంకరు రాణిగ నన్నపూర్ణవై !
నమ్మిన సర్వసంపదలు నర్మిలి నిచ్చి సుధాప్రపూర్ణవై
మమ్ములఁ బ్రోతు వెప్పుడును మా యిలువేల్పు గదమ్మ శాంకరీ !

అక్షిస్ఫూర్తిఁ దలంచి పేరిడిరి నీకత్యంతరక్తిన్ విశా
లాక్షీనామము కాశికాపురిని లోలాక్షీ ! యదేరీతి మీ
నాక్షీనామము బెట్టిరా మధురలో జ్ఞానేశ్వరి ! నీకుఁ గా
మాక్షీనామముఁ గంచిలోన బహునామంబుల్ గదా ! శాంకరీ !

కామా ! కామకలా ! కటాక్షనయనా ! కాంచీలసన్మధ్యమా !
కామాక్షీ ! ఘనకామకోటినిలయా ! కామేశ్వరీ ! కామినీ !
కౌమారీ ! కరుణారసార్ద్రహృదయా ! కల్యాణి ! కాత్యాయనీ !
కామారి ప్రియభామినీ ! సుఖకరీ ! గౌరీ ! నమశ్శాంకరీ !

గిరిజా ! హైమవతీ ! యుమా ! గిరిసుతా ! క్లీంకారిణీ ! యద్రిజా
పరమా ! పావని పార్వతీ ! త్రిణయనా పర్ణా ! పరా ! శైలజా !
వరదా ! పుణ్యఫలప్రదా ! శివసతీ ! భద్రాత్మికా ! యందునా
మటి యేరీతిని పిల్చినన్ బలుకుమా ! మాబోంట్లతో ! శాంకరీ !

బ్రహ్మాణీ ! భువనేశ్వరీ ! భగవతీ ! బ్రహ్మాండ భాండోదరీ !
బ్రహ్మోపేంద్ర సురాది వందితపదా ! రాజీవపత్రేక్షణా !
బ్రహ్మత్మైక్య సురూపిణీ ! సురనుతా ! రాజ్ఞీ ! రమా ! వైష్ణవీ !
బ్రహ్మానందమయీ ! లలాటనయనా ! బ్రాహ్మి ! భజే శాంకరీ !

శ్యామాభా ! నిఖిలేశ్వరీ ! స్తుతిమతీ ; శాతోదరీ ! సుందరీ !
రామా ! యింద్రధనుఃప్రభా ! లయకరీ ! లాస్యప్రియా ! రంజనీ !
శ్రీమాతా ! పరదేవతా ! ద్యుతిధరా ! చిద్రూపిణీ ! చిత్కళా !
కామాక్షీ ! హరిణేక్షణా ! సమరసా ! కల్యా ! నమశ్శాంకరీ !

శ్రీకంఠార్ధ శరీరిణీ ! శుభకరీ ! శ్రీశైలవాసప్రియా !
యాకర్ణాంత విశాలనేత్రయుగళా ! యార్యాంబికా ! త్ర్యంబకా
యేకానంద చిదాకృతీ ! మునినుతా ! యేకాక్షరీ ! త్ర్యక్షరీ
శ్రీకల్యాణ గుణాన్వితా ! మధుమతీ ! జేజేలివే శాంకరీ !

అదికైలాసమొ ! శుద్ధసత్వమయమో ! యానందకేలాసమో !
యది కీలాసయుతంబొ ! సౌఖ్యదమొ ! యత్యంతప్రభాభాసమో !
యది శ్రీవాసమొ ! చిద్విలాసమొ ! తురీయాతీతతత్త్వంబునో
యది యావాసమె ! నీనివాసమగునా ! యౌనౌనుగా శాంకరీ !

దండము విఘ్నరాజునకు, దండము నీదుకుమారసామికిన్
దండము దేవదేవునకు, దండము నీపరివారమంతకున్
దండము వేదవేత్తలకు, దండము నీదగు భక్తకోటికిన్
దండమునందుకో జనని, తల్చెద నెమ్మది నెప్డు శాంకరీ !

# శ్రీ అద్వైత శాంకరీ

మంగళమా మహేశ్వరికి, మంగళమొప్పగు నాదిశక్తికిన్
మంగళమా పరాత్పరికి, మంగళమబ్బును ముక్తిదాత్రికిన్
మంగళమా కళాత్మకును, మంగళమా హృదయస్థశక్తికిన్
మంగళమౌను మంగళకు మంగళమమ్మవు నీకు శాంకరీ !

తలపన్ దోచనివాడ ! నిన్ దలచి తద్వైతంబు సంధిల్ల, నే
బలుకన్ నేర్వనివాడఁ బల్కితి లసత్పాండిత్యమేలేక, నిన్
దెలుపన్ జాలనివాడఁ దెల్పితినిగా దేవీ మహత్తత్త్వమున్
దెలిసెన్ గారణమెన్న నీ కరుణకాదే యింతకున్ శాంకరీ !

పిల్చినఁ బల్కుదేవత ! యభీష్టమొసంగెడి కామదాయినీ !
కొల్చెడి నీదుభక్తులదె కోరగవచ్చిరి శ్రీవశంకరీ !
తల్చిన వారికెల్లఁ బరతత్త్వముఁ దెల్పెడి యోశివంకరీ !
పిల్చినవెంటనే పలికి ప్రేమను కోర్కెలదీర్చు శాంకరీ !

హద్దుగ కొన్ని పద్యముల నచ్చెలువందుచు వ్రాసినాడ, నా
బుద్ధికి దోచినట్లు మణిపూసలు గూర్చిన కావ్యమున్బలెన్
వద్దనకుండ గైకొనుము వందనమమ్మరొ సద్గతిప్రదా !
దిద్దుము నాదుజన్మఁ గడతేర్చు భవాంబుధినుండి శాంకరీ !

# అష్టాదశ శక్తిపీఠములు

శ్లో॥ లంకాయాం శాంకరీదేవీ, కామాక్షీ కంచికాపురే ।
ప్రద్యుమ్నే శృంగళాదేవీ, చాముండీక్రౌంచ పట్టణే ।
అలంపురే జోగులాంబా, శ్రీశైలే భ్రమరాంబికా ॥
కొల్హాపురే మహాలక్ష్మి, మాహుర్యే ఏకవీరికా ।
ఉజ్జయిన్యాం మహాకాళీ, పీఠికా పురుహూతికా ।
ఓఢ్యాయాం గిరిజాదేవీ, మాణిక్యా ద్రాక్ష వాటికే ।
హరిక్షేత్రే కామరూపీ, ప్రయాగే మాధవేశ్వరీ ।
జ్వాలాయాం వైష్ణవీదేవీ, గయా మాంగళ్యగౌరికా ।
వారణాశ్యాం విశాలాక్షీ, కాశ్మీరేతు సరస్వతీ ।
అష్టాదశైవ పీఠాని, యోగినాం దుర్లభానిచ ।
సాయంకాలే పఠేనిత్యం, సర్వశత్రు వినాశనం ।
సర్వరోగహరం దివ్యం, సర్వసంపత్కరం శుభం॥

—)(—